# మునిపలుకు

శ్రీరామచంద్రమూర్తి భగవంతుఁడా కాఁడా అను విషయమునుగూర్చి చర్చచేయుటకు నాకుద్దేశముగాని, సమర్థతగాని, యవసరముగాని, ప్రయోజనముగాని లేదు. వాదప్రతివాదములు పాండిత్య వాగ్యుద్ధనైపుణ్యాదివిశేషముల వెల్లడింపఁగలుగునేకాని, సంసరణ సాగరతరణోపాయమగు భక్తినిమాత్రము కలిగింపఁజాలవు. భక్తికి మూలము విశ్వాసము - విశ్వాసమునకుమూలము పూర్వజన్మకృతపుణ్యము–ఆ పుణ్యమునకుమూలము సద్భుద్ధి–ఆ సద్భుద్ధికిమూలము పరమేశ్వరానుగ్రహము–కావున అమూల్యమగుకాలమును వ్యర్థవాదనకై వినియోగింపక, మనమందఱము విశ్వాసానుసారముగా బుధ్యనుసారముగా శక్త్యనుసారముగా సర్వశక్తుని–సర్వజ్ఞుని–సర్వవ్యాపిని–అత్యద్భుతజగ

న్నాటకసూత్రధారుని — అనిర్వచనీయప్రభావుని — శ్రీమన్నారాయణుని సేవించి జన్మసాఫల్యమునొందఁ బ్రయత్నింతము. పాఠకులకిదియె నా నమస్కారపూర్వకవిజ్ఞాపనము.

హిందువులకు రామభక్తి బోధింపఁబూనుట కమ్మరవీధిని సూదు లమ్ముటవంటిది. ఆ సేతుహిమాచలపర్యంతము సర్వప్రదేశముల శ్రీరామసంకీర్తనలు జరుగుచుండును. రామకోవెల లేని కుగ్రామమైనను లేదు. రామప్రశంసచేయని కుకవియైనను లేఁడు. రామనామము చెవిసోకినంతనే యొడలు పులకరింపని కుజనుఁడైనను లేఁడు. భారతీయులకు సీతారాముల పవిత్రచరిత్ర ప్రాణములకంటెను మధురాయమానమైనది. వాల్మీకి రామాయణము, తులసీదాసురామాయణము, కంభరామాయణము, భాస్కరాదుల ఆంధ్రీకృతరామాయణములు, కాళిదాసాదుల

రఘువంశాదికావ్యరాజములు, త్యాగరాజస్వామికృతులు, రామదాసు కీర్తనలు, సీతమ్మ పెండ్లి పాటలు, పాదుకాపట్టాభిషేకాదినాటకములు, దాశరథీత్యాదిశతకరత్నములు, పురాణకాలక్షేపములు, హరికథలు, "లవకుశ" మొదలగు టాకీలు సుప్రసిద్ధభరతదేశప్రజనుల శ్రీరామానురాగసంపత్తిని వేనోళ్ళఁజాటుచు. శ్రీరామావతారతత్త్వమునకు వ్యతిరేకముగా ఎవరేమిచెప్పినను ఎవరేమిచేసినను ఎవరేమివ్రాసినను మనవారి రామభక్తి అణుమాత్రమైనను తగ్గదుతగ్గదని నొక్కివక్కాణించుటకాధారములుగదా. కాఁబట్టి, యీ రాఘవశతకప్రణీతప్రశంసనీయుడు కాకపోయినను తుంతవ్యుఁడుకాకపోఁడు.

ఉడుతభక్తిని స్మరించి నాకుఁదోఁచినట్లీశతకము రచించితిని. ఇది రెండవకూర్పు. క్రొత్తపద్యములుకొన్ని యిందుఁజేర్పఁబడినవి.

అంత్యమువర్ణలోపముగా "జన్మకర్మ" శబ్దప్రయోగమును, అర్థసౌలభ్యమునకై కొన్నిచోట్ల విసంధులును, మఱికొన్నితావుల సరళాదేశనిరాకరణమును, రేఫఱకారమైత్రియును అఖండయతియు నీతిభక్తిప్రబోధమునకై భావపునరుక్తియు నేను బుద్ధిపూర్వకముగా నొనరించినవే. మఱియు నెట్టిస్ఖాలిత్యములున్నను పాటింపవలదనియు, నేనెంత గ్రాంధికభాషాభిమానినైనను సముచితసంస్కారవిముఖుఁడఁగాననియు, సరసహృదయులగు పాఠకులకండఱకును మనవిచేయుచున్నాను. నాకుఁబ్రోత్సాహముగలిగించిన ఆంధ్రసోదరీసోదరమణులకు మిక్కిలికృతజ్ఞుఁడను.

శ్రీసీతారాములకు జే!

జనమంచి సీతారామస్వామి,

అనకాపల్లి.

అనకాపల్లి పురపాలక సంఘోన్నతవిద్యాలయ ప్రధానోపాధ్యాయులు

# శ్రీ అడిదము నారాయణమూర్తి, యం.యె.,యల్.టి.గారి

సాహాయ్యము

## పంచరత్నములు.

1. ధీయుతుఁడుర్వ బుధేశ్వరవిధేయుఁడు ధర్మపరుండునైన నా
రాయణమూర్తి యీ శతకమచ్చుపడంగ మహాదరంబుతో
సాయమొనర్చె విత్తమునొసంగి; కృతజ్ఞతఁజూపఁబద్యముల్
వ్రాయుచుఁగాని తద్ఘనత వర్ణనసేయఁదరంబె రాఘవా॥

2. అడిదమువంశభూషణములైన కవీంద్రులు దాతలెందఱో
పుడమిజనించి సద్యశముఁబొందిరి దేశమునందుఁగాన నీ
తఁడును సుకార్యముల్ సలిపి ధన్యతనొందఁడె; మల్లెపువ్వులే
పొడమునుగాని మల్లియకుఁబుట్టునె సౌరభహీనపుష్పముల్॥

3. ఏరికినైన దానమొనరించుటయన్నను దైవభక్తస
త్కారముచేయుటన్నను నఖండముదంబుగాంచి యెంతయో
నేరుపుమీఱవర్తిలుచు నిత్యము సత్కృతులాచరించు నా
ధీరునిఁదత్సతీమణి నుతింపకపోదురె యెట్టివారలున్॥

4. "స్వార్థమునకె పాటుపడెడువారెగాని
త్యాగమంతగఁజేయు నుద్యోగులెవరు!
పైకి శ్రీరంగనీతులు పల్కవచ్చుఁ
జేతులార డబ్బువ్యయముసేయఁగలరె
పుణ్యుఁడైన నారాయణమూర్తికరణి!

5. అతఁడుఁదత్కుటుంబంబును నఖిలశుభము
లంది వర్ధిల్లునట్లు నేనాచరింతుఁ
బ్రార్థనము నీకు సతతంబుఁబరమపురుష!
సకలహృద్వర్తి! శ్రీరామచంద్రమూర్తి!

— జ. సీ.

# రాఘవశతకము.



శ్రీరఘురామచంద్రయని చిత్తము రంజిలనొక్కమాటు నీ
పేరుస్మరించినంతఁదనివింగని యీకలికాలమానవుల్
కారుణికత్వముట్టిపడఁగాఁచెదవంచు నెఱింగి మానసం
బారఁగ నీకుఁబద్యకుసుమాంజలి సేయుదునయ్య రాఘవా॥ 1

* * *

రాముఁడుపూర్వకాలమున రాజయి కీర్తినిఁజెందెఁగాన శ్రీ
రాముఁడు దేవుఁడేయనుచుఁ బ్రార్థనసేయుట వెఱ్ఱిగాదె యం
చీమహినెవ్వరేని నను హేళనచేసినఁజేయనిమ్ము నా
కేమికొఱంతవాటిలు? నభీష్టవిధంబున భక్తుఁడైనచో
నేమనుజుండుగాని తరియించుఁగదా భవవార్ధి రాఘవా॥ 2

* * *

పరులప్రశంసనొందుటకె భక్తినిజూపెడు దొంగకంటె ని
బ్బరమున నాస్తికత్వమునవర్తిలు మూర్ఖుఁడె శ్రేష్ఠుఁడుర్వరన్
పరమతనిందసేయుటకుఁ బ్రాజ్ఞతమీఱ నిదర్శనంబులన్
బరులకు నచ్చఁజెప్పఁగల బ్రహ్మవిదుండెవఁడయ్య రాఘవా॥ 3

నమ్మకమేది మానసమునంగలదో యదితోఁపఁజేయు మా
ర్గమ్ములు దైవభావనయుఁబార్థనపూజనసేవనాది కృ
త్యమ్ములుఁజేయ హక్కుగలదందఱకున్; మఱియేల వ్యర్థ వా
దమ్ములు? నీ యనుగ్రహముదక్క నిఁకేదియువద్దు రాఘవా॥ 4

*　　　　*　　　　*

ధరణిని రామనామజపతత్పరతామహిమంబుచేత నెం
దఱో భవసాగరోత్తరణధన్యత గాంచి, యఖండమోక్షరా
జ్యరమకు శాశ్వతాధిపతులైరని వింటినిగాన నేను నా
నిరుపమభాగ్యమొందఁదగు నిష్కపటోద్యమమాచరింతు, నే
యరమరలేక తోడ్పడవె యడ్డములన్నియుఁదీర్చి రాఘవా॥ 5

పోతనభాస్కరాదికవిపుంగవులట్లు కవిత్వమల్లఁగా
నాతరమా నె యెన్నఁడయినన్? తలిదండ్రులు మొద్దుఁగుఱ్ఱనిన్
సైతము మక్కువందనిపి సంతసమొందకపోరుగాన, ఆ
రీతినె నీవు నా పయిని ప్రేమరసంబొలికింపు రాఘవా॥ 6

* * *

ఎన్నోనాటకముల్ మఱెన్నొకథలింకెన్నోప్రబంధంబులె
న్నెన్నోపాటలు నిన్నుఁగూర్చి వెలసెన్ బృథ్వీతలంబందహా!
యెన్నన్ నీచరితంపుమాధురికి నీడేలేదుస్వామీ! అదే
నన్నీరీతిభవత్ప్రశంసకునుబూనం జేసెఁగా! రాఘవా! 7

ఎంచగరాని ప్రేమమున నీనిటు చెప్పెద నాంధ్రపద్యముల్
మంచివి గాకపోయినను మానసమందలి భావమెంచి మ
న్నించెదొ చిన్నపుచ్చెదవొ యెట్లయినన్ సరె యేమిచేయుదున్!
కొంచెముపింఛీయున్నపుడు గొప్పది యెట్లగు రొట్టె? రాఘవా॥ 8

* * *

ఏలికవన్న భావమున నెవ్వరు నీకొఱకే మొసంగినన్
శీలముఁబట్టి గారవముచేసి గ్రహింతువు దానిఁ, గానిచో
ఏల భుజింతువా శబరి యిచ్చిన యెంగిలి పండ్లమున్వు; నీ
లీలను భక్తులన్ దనుప లేఁడు మఱేవిభుఁడైన రాఘవా॥ 9

ఏఁదలపెట్టినట్టి పనియెంతయుఁగొప్పది, కాని, నేరుపే
లేదయ; నైన నేమిఁకఁజలింపను; సేతువుగట్టువేళ నీ
వాదటంబోయినా వుడుతయాచరణంబున కట్టులిప్పుడున్
నీదయ వెల్లడింతువని నేనునునమ్మితినోయి రాఘవా॥

* * *

తియ్యఁగనుండుఁదేనియలు, తియ్యఁగనుండును పంచదారయున్
తియ్యఁగనుండునిక్షువును, తియ్యఁగనుండు నరంటిపండులున్
తియ్యనివట్టివెన్నో జగతిన్ గల; వైనను, రామనామపుం
దియ్యఁదనంపుసాటియగు తియ్యనయొందును లేను రాఘవా॥

ఆడుమలఁ బెట్టితంచు నిను నెన్నఁడు దూఱనయా మహాప్రభూ
కడుదయనీకుఁగల్గుటయె కారణమంచుమదాఁచువానినే
బడుటకు; లోకమెట్టిదో విపత్తులు తెల్పఁగఁజాలినట్టు. తె
వ్వఁడు సెటిఁగింపలేఁడనుభవంబె ప్రశస్తపుటొజ్జ, రాఘవా॥ 62

* * *

ఒకనిఁగవీంద్రుఁగాను, మఱియొక్కనిభక్తవరేణ్యుఁగాను, వే
ఱొకనినివాగ్మిఁగాను, నొకనొక్కనిగాయకుఁగాను, లోకమం
దొకనికిలేనిశ్రద్ధ మఱియొక్కనికుండునటుల్ సృజింతువ
య్యకరుణ నీవుమానవులనందఱ నద్భుతలీల! రాఘవా॥ 63

సిరియున్నందునఁగాక వేఱుగతిఁగొంచెంబేనియుఁ గౌరవా
దరసేవార్హతలేని మానవులచెంతంజేరి మాఁడాడుచుఁ
ధరపై జీవనయాత్ర సల్పుటతిచింతాహేతువౌనక్కటా!
పరులన్ వేఁడుటకంటె సత్కవికి నాపత్తేదయా? రాఘవా॥ 14

* * *

ఏయుద్యోగము చేయఁబూనక యె, తానెవ్వారిఁ బ్రార్థింపకే
మాయల్ పన్నక యీ కలిన్ నరుఁడు సంసారాంబుధిన్ దాఁటలేఁ
డేయుంచెందఁడొ పల్కుమాటయు నిజంబేయైనఁగావచ్చు; నీ
దే యీబాధఁదొలంచుభారమును తండ్రీ ప్రోవవే రాఘవా॥ 15

బమ్మెరపోతరాజు కవిపట్టపురాజయి, భూమిరాజభా
గ్యమ్ముఁ దృణీకరించి, సకలామరవందితరామరాజపా
దమ్ములుమాత్రమే కొలిచి ధన్యతగాంచినపూజ్యుఁ డంచు దే
శమ్మునఁ గీర్తి సంతతముఁ జాటెడి, నెంతఘనుండొ! రాఘవా॥ 16

* * *

కృతిలో దోషము లెంచియెంచి కవి నాక్షేపించు టేమంతగా
ప్రతనంబా కవికష్టమెట్టిదియొ కావ్యంబుల్లుప్రౌఢుండెగా
కితరుల్ గాంచఁగలేరు; బిడ్డఁగనుసన్ప్రేవేదనన్ గర్భిణీ
సతి పాలించునొ గొడ్డురాలికెటుఁగన్ శక్యంబుగాకో! రాఘవా॥ 17

పరిమళయుక్తమై గనులపండువునైన గులాబిపువ్వదే
సరణిని గంటకాళిసరసన్ జనియించునో, పంకమందునే
కరణిని బద్మ ముద్భవముగాంచునో, యట్లె గుణంబుగల్గుఁగా
యరయఁగదోషమున్న యెడ; నయ్యదిగ్రాహ్యముగాదె రాఘవా॥ 18

* * *

ఎంతటిగ్రంథమందయిన నెవ్వియొ తప్పులుకొన్నియుండుఁదా
నెంతటివాఁడుగాని నరుఁడెద్దియొదోషముగల్గితీరుఁ; గా
సంతకళంకమున్నదిగదా శివుఁడున్ దలమీఁదఁబెట్టు కొ
న్నంతటివానికైన, జగమందిఁకఁబూర్ణుఁడెవండు? రాఘవా॥ 19

వీఁడును వాఁడునంచు మది వేఱువిధంబుల నెంచ; నేను నీ
వాఁడనటంచు వేఁడిన ప్రపన్నుని బ్రోవకమాననంచహా!
నాఁడు సముద్రతీరమున, నాథ! ప్రతిజ్ఞ యొనర్చినాఁడవే;
నేఁడెటు తప్పు నీవ్రతము నేనును వేఁడ? మహాత్మ రాఘవా॥ 20

* * *

రావణు రూపుమాపి యిఁక రాజువు నీవని నిన్ను లంకకుఁ
గావ వెయంచు నాతఁడును గ్రక్కున వచ్చి మహిజ నిచ్చినన్
రావణు నాయయోధ్యకును రాజును జేయుదునంచుఁ బ్రీతితో
నీవు విభీషణాఖ్యుఁ గరుణించినవాఁడవు గాదె! రాఘవా॥ 21

రాతిరివచ్చినన్ బగలు రావలయుంగద దానివెన్కఁ; న
ష్టే తమయాపదల్ దొలఁగి యొంతయు సౌఖ్యముగల్గునంచుఁగ
ష్టాతురులెంచి మానసములందు నినుంగదు నమ్మియున్నచో
ఏ తఱినో సుఖంబుగలిగించెదు తప్పకనీవు రాఘవా॥ 22

*   *   *

చలిబాధన్ దొలఁగింపనగ్నియుఁ బిపాసాపీడఁ బోఁగొట్టఁగా
జలమున్, క్షుత్తునడంప నన్నము నవశ్యంబౌనటుల్ భక్తి కా
వలయున్ సంసరణార్తిదీర్చి ముదమాపాదింపఁగాఁ బట్టి ని
శ్చలదీక్షన్ నినుఁగొల్చు నేర్పరివిగా సల్పంగదే రాఘవా॥ 23

భక్తింగాలముఁబుచ్చఁగోరిసఁగుటుంబం బెంతయో పెర్గుచున్
భుక్తింగూర్చియె సంతతంబు శ్రమముం బొందించెదుర్; భాగ్యసం
యుక్తుల్ మత్తతచేత దుర్విషయలౌల్యోపేతులై భక్తినా
సక్తింబొందుటెయర్దు; నీకొలువనన్ సామాన్యమే? రాఘవా॥ 24

* * *

అరిషడ్వర్గముఁగెల్చినన్ బరమసౌఖ్యంబబ్బునం చెందఱుం
దఱొతత్త్వజ్ఞులు పల్కుచుందురది సత్యంబేయగుంగాని, యె
వ్వఁగుసాధింపఁగనేర్తురయ్యా? అదిపై పైనున్నదేయంత! సా
గరనీరంబులు తియ్యనౌటెటులో యాకార్యంబటుల్ రాఘవా॥ 25

హరియును లచ్చికిన్ వశుఁడటన్న మఱెవ్వఁడుగాఁడు? తద్వశీ
కరణకళా ప్రభావమవఁగా నటువంటిదిసుమ్మి బాపురే!
సిరి యెటనుండునో యచటఁ జేరును రెండవవా డానికోసమై,
నరులు పరుండుచోటులనె నల్లులు పట్టువిధాన, రాఘవా॥ 26

*　　*　　*

ధరపై నిష్ఠుధనాధికారములు పొందంగల్గునెంతేని యా
దరమందొక్క శతాంశమేనియును విద్యల్ గాంచలే వక్కటా!
పరమాధర్మమయంబు లోకమని సర్వాంశంబులున్ జాటు; నె
త్తఱివచ్చున్ దయనీకు ధర్మమును సంస్థాపింపఁగన్? రాఘవా॥ 27

"ప్రతియుగమందుఁబుట్టెదను పాపులనెల్ల నడంచి సాధుసం
తతులనుబ్రోచి ధర్మమును స్థాపనసేయఁగ," నంచుఁబార్థుతో
నతికరుణార్ద్రమానసుఁడవై మఱియొక్కస్వరూపమందుఁబ
ల్కితివని 'గీత' చెప్పినది కేవలసత్యముగాదె రాఘవా॥ 28

*　　*　　*

వినయముఁదోపనీను, మదవృద్ధికిఁదోడ్పడుఁబెంచుఁగ్రోధముల్,
కనులనుజూడనీదు, మఱికర్ణములన్ విననీను, బంధులన్
మనుపటియట్లు సన్నిధికిఁబోవఁగనీదధికారరోగమే
మనుజునిఁబట్టుకొన్న; నదిమానుపువైద్యుఁడెవండు? రాఘవా॥ 29

సుబ్బండైనను కల్మికల్గినయెడన్ సుబ్బయ్యగారే యనన్;
డబ్బున్ లాగ ననేకులాతనిని గొల్వం బోయి స్తోత్రంబుగా
దబ్బుల్ వల్కుదు రాతఁడే ప్రభువు నాతండే గుణాఢ్యుండు హా!
డబ్బే దైవమటంచుఁ జెప్పఁదగు కాలం బబ్బెఁగా! రాఘవా॥ 30

*　　*　　*

విద్యాభ్యాసఫలంబనంగ నకటా! విత్తార్జనం బంట! యే
యుద్యోగంబునొ చేయుటంట! యధికారోన్మాదులౌటంట! దు
ర్విద్యాబుద్ధులు నేర్పు పద్ధతులు ప్రాప్తింపన్ మతేమాను! ధ
ర్మోద్యుక్తుల్ కలవౌట యబ్బురముగా దూహింపఁగన్ రాఘవా॥ 31

వరశుల్కంబునుస్వీకరించుటతిపాపంబైననాఁగాక యె
వ్వరుమానంగలరయ్య! దానికొఱకే వైవాహికోద్యుక్తులౌ
దురు! విద్యాభ్యసనంబుదానికొఱకే! దుర్దాంతవిత్తాశయే
ధరణింబాలనసేయు, దిక్కుఁగలదే ధర్మానకున్? రాఘవా॥ 32

* * *

చెడినను మానుయేచెడును జేకొనెదన్ దగినంతకట్నమున్
విడువనుపై నయ్యైన, ననిపెండ్లికుమారుఁడు పట్టుపట్టినన్
గడుసుఁదనంబుగానదియగాంచునుబంధుజనాదరంబు, నొ
క్కఁడయిన ఛీయనండుగద కాలమహత్త్వమదేమొ! రాఘవా॥ 33

సంతసముఁ దోలి గోవులను చాల వెలియ్యఁగఁ బూనువారికే
సంతసమొప్ప విక్రయము సల్పెదునట్టులు, పెండ్లి సంత నెం
తెంతయొ ద్రవ్యముం గొనుచు ఏముసలయ్యలకేని కూఁతులన్
సుంతయు సిగ్గు లేకొసఁగు శుంఠల నేమనవచ్చు! రాఘవా॥ 34

*     *     *

శ్రీరఘురాము మామ నని శ్రీమిథిలానగరాధినాథుఁడున్
శ్రీరమణీసమానయగు సీతకు మామ నటంచు నాయయో
ధ్యారమణుండు పొంగఁగ, మహాద్భుతశోభఁ జెలంగు పెండ్లికిన్
ధారిణియందు సాటిగలదా పరిపూతచరిత్ర! రాఘవా॥ 35

గుణవతులౌనవోఢలకుఁగూడ గృహంబుల అత్తగార్లపో
రును భరియింపలేమిఁగడురోఁతజనించును బ్రాణమందుఁగా
వుననెయకాలమృత్యువునుఁబొందుదురెందఱోయటంచుఁబల్కుదుర్
జనులిల నట్టియత్తలె పిశాచములందొకజాతి! రాఘవా॥ 36

* * *

నెమ్మనరణ్యగామివగు నిన్వీక్షకుండులతాంగిఁజూచి "సీ
తమ్మ! భవన్ముఖంబుక్షణమైనను జూడక నేను నిల్వలే
నమ్మరొ! నాదుకోడలుగనై తివి కష్టములిన్నికంటకే
సుమ్మ" యటంచు శోకమునఁజొక్కినయట్టి మహాత్మురాలి, మీ
యమ్మనుబోలరాదె జగమందలియత్తలుప్రేమ! రాఘవా॥ 37

వనమందుండి శరీరరక్షణ మొనర్పఁ నన్ని యోగించి, కు
జ్జనిపైఁ బెట్టితివమ్మ యీ భువనభారం బెల్ల; ఏకార్యమై
వ్వని కెంతే సులభంబొయంచు నుదలంపఁ, నీవు నాయాందచూ
పినదే హెచ్చుగు పక్షపాతమని తోఁపించుంగదా తల్లిరో
యని కైకేయిని మెచ్చునీకుఁ బ్రతియాహా! నీవగా, రాఘవా॥ 38

నీతండ్రిఁ మును సత్యబద్ధుఁడలుపఁ నీవెల్ల రాజ్యంబు సం
ప్రీతిఁ వీడి ప్రయాణమౌనెడ "ననుఁ మీ వెంటఁ గొంపోవరే
మీతోఁ గూడ వసించునప్పుడు వనంబే నాక యోధ్యాపురం
బై తన్వఁ గలిగించునం చెఱుఁగరే ప్రాణేశ్వరా?" యన్న శ్రీ
సీతాదేవి మహోక్తులెల్లపుడు రక్షించఁ మమ్ముఁ! రాఘవా॥ 39

నీకుంబట్టముగట్ట సంతసముతోసీతంద్రిఁయత్నింపఁదా
మేకగ్రీవముగా జనుల్పొగడి యెంతేహర్షముంజెందిరా
నీకేమోదముగల్గలేదఁటగదా! "నేరాజనైనన్ బ్రజా
నీకంబున్ దనియింపనేర" నను సందేహంబుగాఁబోల్చలీ!
లోకంబంమన నీయడంకువకు నీమున్ గాంతుమే రాఘవా॥ 40

* * *

అజ్ఞానంబువిశేషమైనపుడె గర్వాంధత్వముంగాంచి, స
ర్వజ్ఞత్వంబు ఘటిల్లినట్లె మదిలోభావించుమర్త్యుండు; తాఁ
బాజ్ఞుండైన నడంకువంగలిగి యల్పజ్ఞుండుగానెంచెడిన్;
ప్రజ్ఞాశాలికిభూషణంబనఁగ నమ్రత్వంబెగా, రాఘవా॥ 41

సిరికృపయబ్బువారలకుఁ జేకుఱుఁబోదు సరస్వతీదయా
గరిమము; భారతీప్రియులు కాంచఁగఁజాలరు లచ్చిమక్కువన్;
సిరియును విద్యయుంగలుగఁ జెల్వగు రూపమునబ్బ, దబ్బనే
నురుగుణరాజియుంగలుగ, దొక్కధరాతనయావిభుండె య
బ్బురముగనన్నియుంగనిన పూజ్యుఁడటందురుగాదె! రాఘవా॥ 42

* * *

"కడుపారఁ దనుఁగన్నతల్లియగునా కౌసల్యకంటెన్ నినుం
గడుఁ బ్రేమంబునఁజూచి నీకఖిల సత్కారంబులం జేయుచుం
డెడిరామున్ వనభూమికింబనిచితే లేరాక్షసీ?" యన్న భ
క్తుఁడు శ్రీమద్భరతుండె నీగుణముమాకుం దెల్పెఁగా రాఘవా॥ 43

అడవులలోన వసింపఁగ జటాజినముల్ ధరియించి మీపురిన్
విడిచి రయాన నీవు చనువేళ భవన్నగరంబులోననుం
డెడుజనులెల్ల నిన్విడువలేకతిదుఃఖముతోడ నీదువెం
బడిఁజనుచుండిరంట! యెటువంటిగుణంబులో నీవి! రాఘవా॥ 44

* * *

ఒకయూరేలెడిమానవాధముఁడె గర్వోద్రేకియై కన్నుగా
నకవర్తించునుగాని లోకమునకున్ నాథుఁడవై యుండియున్
సకలాత్యద్భుతశక్తులన్ గలిగియున్ శాంతుఁడవై యాశ్రితా
ళికభీష్టార్థములిత్తువన్యశముగన్నెన్నికహా! రాఘవా॥ 45

రాతినినాతిఁజేయ, భృగురామునిగర్వమడంప, నబ్ధికిన్
సేతువుగట్ట, రావణునిజీవముఁద్రెంప, నరణ్యవాసులౌ
కోఁతుల బంధుమిత్రులుగఁగూర్చుకొనంగ, విమాతకైన సం
ప్రీతినిసేవలంజలుపఁబృథ్విమతెవ్వఁడుచాలు? రాఘవా॥ 46

* * *

నినునొకసారిచూచిన మునీశ్వరులైనను మోహమంది, ని
న్నయమునల్లెచూడవలెనంచునుగోరుదురంట! యౌర! నీ
యనుపమరూపమొక్కపరియైనను జూపఁగరాదెనాకు? నిన్
గనుటెఁక నెప్పుడెప్పుడని కన్నులుకాయలుగాచె రాఘవా॥ 47

ఆరయ నెంతదృష్టమొగదా గుహుఁడొందినదల్లనాఁడు! సీ
తారమణుండువచ్చెనని తత్క్షణమే ప్రమదాబ్ధిమున్గి ని
న్నో రఘురామ యనుచు నుత్కటమౌ తమిఁ గౌఁగిలించె! నీ
కూరిమియున్నచో, నెవరికోరిక నిష్ఫలమౌను? రాఘవా॥ 48

* * *

శ్రీకర! పాదుకా రజోమహిమ ... ధాత్రిలోఁ
బ్రకటకీర్తిగాంచిన భవచ్చరణాబ్జములిప్పు నావయౌ
సోకిన, నద్దిరామయిపునోయని భీతిని నీపదంబుల
స్తోకజలంబులంగడిగెఁ దొల్లి నిషాదవిభుండు బాపురే!
నాకటువంటిభక్తియె మనంబునఁగల్గఁగనిమ్ము రాఘవా॥ 49

పరులను వేఁడఁబోననుచు బాసయొనర్చినవాఁడఁగాని, పే
దఱికముచేత వాఞ్ఛయతి దప్పితిఁగా! పరితాపవహ్నిఁచే
దరికొనుచున్నదయ్యమది; దాతలకెల్లను దాతవైన నీ
శరణనియున్నవాని కగచాట్లను బెట్టెదవేల? రాఘవా॥ 50

* * *

కోరికలుజ్జగించిన సకుంఠిత మానసశాంతిఁబొందఁగా
నేరుచుమానవుండదియె నిక్కపుసాధనమింక నేదియుఁ
ధారిణి లేదు లేదనుఁచుదద్జ్ఞులు పల్కఁగవింటిఁగాని యే
కోరిక లేనియున్కి సమకూరు విధంబదియేది? రాఘవా॥ 51

సిరిగలయప్డు నీపయిని చిత్తము నిల్పదటండ్రుగాని పే
దఱికముమాత్రమేపగిది దానిని నీపయినిల్పు? మత్తఱిఁ
సిరిగలవాఁడు మై మఱపుఁజెందిన, బీదగృహస్థు దీనతఁ
పరజనయాచనాద్యమితబాధలఁజెందకయున్నె? రాఘవా॥ 52

* * *

అడుగుటకంటె ఘోరతరమైన విపత్తిలఁగల్గనేరదే
న్నఁడుఁజేయి సాఁపకుండఁగ దినంబులఁబుచ్చుటె కష్టమంచుఁదోఁ
చెడిని కుటుంబపోషణముచేయుట తప్పదుగాన; నాకు నీ
యడుగులుగొల్వ శాంతియెటులబ్బును నీకృపలేక రాఘవా॥ 53

ఏమనుజుండు తానెచటికేగిన నేగునుగాక, యెవ్వరిన్
వేమఱుఁజూచి వేఁడినను వేఁడునుగాక, యదృష్టశూన్యతన్
గామితమొందలేక కడుగాసినిమాత్రము పొందుటబ్రమే?
గ్రామముక్రొత్తదైన నఁదనకర్మము క్రొత్తదిగాదు రాఘవా॥ 54

* * *

ఎల్లవిధంబులన్ ధనికబృందదయారసమొంద యత్నముల్
చల్లఁగజేసిచేసి, విరసత్వముదప్పఁ మతేమిగాంచలే
కుల్లకులందుఁగొంది, విసుగొంది, విరక్తినిజెంది "ధీధనం
బొల్లమనర్థహేతు" వనయుక్తమె? నక్కకుద్రాక్షపండ్లు మున్
పుల్లఁగనున్నవన్న కతపోలికనుండునుగాదె? రాఘవా॥ 55

ఎక్కడఁ జూచినన్ గపటమే యభివృద్ధినిఁ జెందుచుండు హా!
యొక్కఁడు లేఁడు నీతి మనుచుండెడివాఁ డొకవేళ నున్నచో
సుక్కవలెన్ దరిద్రతను సుంతయు సౌఖ్యముఁ గాంచలేక; నా
కక్కజమౌను యోగ్యుఁడగు నాతని పాట్లుదలంప! రాఘవా॥ 56

* * *

పుట్టిననాఁటనుండియును పొట్టకు బట్టకు దేవులాడు నే
నెట్టులు నిన్నుఁ గొల్వఁగల నెప్పుడు హాయిగ నుండుఁ బ్రాణమి
కట్టులఁ బాసి? నీపరమకారుణికత్వముఁ జూపవేల? నీ
విట్టులుపేక్ష చేసివ, మఱెవ్వరు ప్రోతురు నన్ను? రాఘవా॥ 57

తమ్ములఁజూచినట్టిగతిఁ దప్పకచూచెద వాశ్రితాళి ని
త్యమ్మనటంచుఁబల్కుదురు తద్జ్ఞులు; వానరసేనఁబ్రోచుమా
ర్గమ్ము నిదర్శనంబుగ విరాజిలెదానికి; మున్నుకేశవం
శమ్మునసైనజన్మఁగనఁజాలక పోయితినయ్యొ! రాఘవా॥ 58

*　　　*　　　*

ఆటల్ పాటలునిష్టమా చిఱుతప్రాయంబందుఁ, గామంపుస
య్యాటల్ చాలరుచించుయౌవనపుఁబ్రాయంబందు, నెంచంగ నీ
మాటల్ దప్పముఁబొందుగోష్ఠియెడఁబ్రేమంబంతగా లేదయా
నీటల్ ముంచెదొ పాలముంచెదొ నన్నుఁ, నీచిత్తమో రాఘవా॥ 59

గానముచేతనిన్ దనుపఁగల్గుట కేవలనారదుండనే
దానముచేత నీవుప్రమదంబుగనన్ బలిచక్రవర్తినే
మానముచేత నీకుబహుమానము గాంచుట కర్ణునుండనే
యేనొకనిష్ప్రయోజకుఁడ, నేగతి నిన్నలరింతు? రాఘవా॥ 60

*  *  *

రామపదంబుసోఁక నొకరాయి వనంబున రామయయ్యెఁ; నా
రాముమహాత్త్వమిట్టిదని ప్రస్తుతిసేయఁదరంబెయంద్రహా!
నీమహనీయపాదములు నిత్యముఁదాల్చెడు నామనంబు తా
నేమి సుభాగ్యమొందెడినొయింకని యువ్విళులూరు రాఘవా॥ 61

ఇడుములఁ బెట్టితంచు నిను నెన్నఁడు దూఱనయా మహాప్రభూ
కడుదయ నీకుఁ గల్గుటయె కారణమంచు మనుదోఁచువాని నేఁ
బడుటకు; లోకమెట్టిదొ విపత్తులు తెల్పఁగఁజాలినట్టు లె
వ్వఁడు నెఱిఁగింపలేఁ డనుభవంబె ప్రశస్తపుటొజ్జ, రాఘవా॥ 62

*　　*　　*

ఒకనిఁ గవీంద్రుఁగాను, మఱియొక్కని భక్తవరేణ్యుఁగాను, వే
ఱొకనిని వాగ్మిఁగాను, నిఁక నొక్కని గాయకుఁగాను, లోకమం
దొకనికి లేని ప్రజ్ఞ మఱియొక్కనికుండునటుల్ సృజింతువ
య్యకరుణ నీవు మానవులనందఱ నద్భుతలీల! రాఘవా॥ 63

ఎందఱు లేరు నాటకములెన్నొ రచించినవారు భూమిపై;
అందెదియేనియున్ భవదనంతరసాంచితవిశ్వనాటకం
బందలి పాత్రపోషణమహాద్భుతకౌశలరామణీయకం
బందు శతాంశమైనఁగలదా? కవియన్నను నీవ రాఘవా॥ 64

* * *

ఎందులకీజగంబు సృజియించితొ, యేమగునోయిదిక, నే
మొందులకున్ ధరిత్రి జనియింతుమొ, యెందుల కేము మృత్యువున్
జెందుదుమో, మఱేమగునొ చెల్లినపిమ్మట? నంచు వేఁచెడిన్
సందియముల్; విచిత్రమిది సర్వము మాయలమారి! రాఘవా॥ 65

ఒక్కఁడు పెండ్లి చేసికొనుచుండఁగ, వేఱొకఁడొంటిఁ జావు; నిం
కొక్కఁడు పిండివంట తినుచుండఁగ నొండొకఁ డేఁప్పగంజికి
ట్లోకని మేషమందె ముద మొక్కఁడ నార్తి మొఱ్ఱొండుచోటనా!
నెక్కటితమున్నదో విధికి నిట్టివిలాసము పుట్ట? రాఘవా! 66

* * *

ఏరోగంబును లేక యెన్నవలె నెంతే దార్ఢ్యముం జూపువా
డోరా! యొక్కని మేషకాలమునఁ బీనైయుంట, ఆ పూఁటకా
హారం బేమియు లేని పేదకొక నాఁడత్యంతభాగ్యంబు చే
కూరక, లక్షలు గూర్చువాఁడు తుదిఁ భిక్షుండౌటయుం జూడఁగాఁ
బ్రారబ్ధంబనుదాని శక్తి గ్రహియింపఁగ వచ్చుఁగా రాఘవా॥ 67

మనుజుండిప్పుడు పూర్వజన్మకృతకర్మన్బట్టి పొందుఁ సుఖం
బునో దుఃఖంబునో యంచు శాస్త్రములు దెల్పుంగావునఁ సత్యమే
యని భావింతునుగాని, బ్రహ్మ సరుఁచే ఆ కర్మఁ జేయింపనే
లను సందేహముతీఱకున్నయది దేవా యెట్టులుఁ! రాఘవా॥ 68

* * *

మతములనేకమున్నవనుమాటయథార్థమ; కాని, మా
మతమె ప్రశస్త మన్యములు మంచివిగావని యెవ్వరన్న స
మ్మతమగునే యుదారమతిమంతున కన్నియు ముక్తిమార్గసం
గతములెయన్న సత్యమును గన్గొనువాఁడె వివేకి రాఘవా॥ 69

పుడమిని నేడ్పుతోఁ గలుగఁ బూరుషుఁ డంతఁ గ్రమక్రమంబుగాఁ
గడుపునకుఁ ధనంబునకుఁ గాంతకు నేడ్చుచునుండు; నిట్టులె
ప్పుడుఁ గడుదుఃఖమే గనుచు ముక్తిపథంబున నేఁగఁ డక్కటా!
పుడకలఁ గాని పోవదొకో పుట్టెనుబుట్టినబుద్ధి! రాఘవా॥ 70

* * *

ఎవ్వఁడు నీపదాబ్జముల నెంతయు నిష్ఠను గొల్చుచుండునో
యెవ్వఁడు నీకృపామహిమనే తనుపొందక ప్రస్తుతించునో
యెవ్వఁడు నీకుఁ బ్రీతికర మేదియొ దానినె యాచరించునో
యవ్విభులాత్ముఁ డొందు ననయమ్ము నఖండసుఖమ్ము రాఘవా॥ 71

చేతన్ లేదొకపైసనాకునిధి మాసీతావిభుండేగదా!
యాతండేయిఁకఁదీర్చు నాఋణము సవ్యాజానుకంపామతిన్
సీతారాములనెప్డుఁగొల్తుననినిశ్చింతాంతరంగంబుతో
సీతమ్మన్ నినుఁగొల్చిగోపనఘనశ్రీనొందెఁగా రాఘవా॥ 72

*　　*　　*

కీడొనరించుమానవునకేని హితుండగు మేటిమేటి; త
న్వేఁడక మున్నె పేదకు నభీష్టమొసంగెడుదాతదాత; మా
తాపితస్వామియానతి శిరంబునఁబూనెడుబంటుబంటు; చే
వొడుపుచేసి నిన్గొలుచు పూరుషుఁడేపురుషుండు రాఘవా॥ 73

నిన్నెడఁబాసినందులకు నిత్యము శోకమహాబ్ధిమగ్నయై
యున్నధరాతనూజఁగని యుంగరమిచ్చుచు "తల్లి! నాథుఁడే
సన్నిటులంపె నీకడకు; నమ్మికపుట్టఁగదీని నిచ్చినాఁ"
డన్న సమీరపుత్త్రుఁగని ఆయమ యెంతగసంతసించెనో!
యెన్నఁగనట్టి బంటు మఱియెవ్వఁడుగల్గునుమీకు? రాఘవా॥ 74

*   *   *

ఎక్కడనెప్డు "రామ" యను నెవ్వరిపల్కును విన్నఁదత్‌క్షణం
బెక్కడలేనిమోదమున నెంతయుపొంగుచు "రామ! రామ!" యం
చక్కడకేగిపాడుచును నాడుచుఁజొక్కుచు నశ్రుధారలన్
గ్రక్కనరాల్చు పావనిముఖాంబుజమెన్నఁడుచూతు? రాఘవా॥ 75

భాగవతాదిసుప్రథితభక్తిసుధారసపూర్ణకావ్యముల్
బాగుగనిచ్చలుంజదువువాఁడ, ననిర్వచనీయమహాముదం
బేగనువాఁడఁగాని, మదినింకను నిశ్చలభక్తి లేదయో!
యేగతి నీభవాబ్ధిఁదగిియింపఁగనోపుదునయ్య? రాఘవా॥ 76

*  *  *

ఆసలఁగెల్వనేరక మనోశ్వముత్రిప్పినయట్టు లేగి యా
యాసము నెంతపొందితినో యంనుల కెంతవిచారమయ్యెనో
వీసముదాచకుండ వినిపించుచుసర్వము, నీకు మ్రొక్కెదన్
దాసునితప్పులన్నియును దంపముతోసరిగాఁగ రాఘవా॥ 77

ఎప్పుడో చావు తప్పదని యెవ్వరెఱుంగరు? కాని, మత్తులై
యెప్పటికప్పుడేమఱచి యెన్నొ యకార్యములాచరించుచున్
జెప్పఁగరాని బాధపడి చేసినవానికి నేడ్తురెందఱో!
యెప్పుడు మోదమిచ్చునది యేదన భక్తియగాదె రాఘవా॥ 78

* * *

అనయంబున్ భవదీయపాదకమలధ్యానామృతంబానుచున్
వనిలో నిల్గని, నీదుపాదుకలకుంబట్టంబుగట్టించి, వా
నిని శీర్షంబునమోచి తెచ్చి, యలనందిగ్రామమందుండి భ
క్తిని నీపేరనె కార్యముల్ సలిపి, కీర్తిన్ గన్న ధన్యాత్ము స
ద్గుణరాశిన్ భరతున్ నుతింప విధికిశక్తుల్ చాలునే! రాఘవా॥ 79

"తమ్ముఁడ! చూడుమీనగలు ధాత్రిజవేమొ కపీంద్రులిచ్చి నా
కిమ్మగ" నంచునీవనఁగ, "ఎల్లపుడేనభివందనంబు పా
దమ్ములకాచరించుటను దప్పనివాఁడనుగాన, అందెలా
యమ్మవియేమొ చెప్పఁగల నన్యవిభూషలెఱుంగ నెంతమా
త్రమ్మ"నటన్న లక్ష్మణుని ధన్యతయెంతనవచ్చు! రాఘవా॥ 80

* * *

బ్రదికెడిమూఁడునాళ్లు జవరాండ్రకొ కల్మికొ దేవులాడుచున్
మది నుపశాంతియన్న దణుమాత్రమెఱుఁగక మర్త్యయంబొన
ర్చెదరు స్వకాలమంతయు ధరిత్రిని బెక్కుఁడు; నీతిఁబూర్తిగా
వదలిరి; యెంత ఘోరకలి! పాపవె దుర్దశనెల్ల రాఘవా॥ 81

ఎన్ని పరీక్షలందు జయమెత్తిన, వేతనమెంత తెచ్చినన్
మన్ననెంతపొందినను మాటలనెంతటి నేర్పుఁజూపినన్
పున్నెమునొందలేఁడుగద పూరుషుఁడెవ్వఁడు నీతిలేనిచోఁ;
దిన్నఁగదిద్దిమానవుల దేశమహోన్నతిఁగూర్పు రాఘవా॥ 82

* * *

కాశికి నేగుమాత్రమునఁగల్గునె ముక్తి? విభూతిచేతనే
యీశుని మెప్పునొందఁగలమే? జపమాలను ద్రిప్పినంతనే
యాశలు దూరమైనవియె? ఆత్మవిశుద్ధినిగన్నవాఁడె స
ర్వేశునికిష్టుఁడౌను, పయివేషములెందులకోయి! రాఘవా॥ 83

తనపెండ్లామొ, కొమారుఁడో, కొమరితో, తన్నెంచువారో, ప్రియం
బునుబుట్టించు మఱెవ్వరేని మరణంబుఁగన్న వేళ సరుం
డనుతాపానలతప్తచిత్తుఁడయి వేదాంతంబుభాషించుచుఁ
ఘనవైరాగ్యవిధంబుఁజూపునహహా! కానెప్పటికేగదా
దినముల్ చన్నకొలంది! మోక్షమెటుప్రాప్తించుఁ? రాఘవా॥ 84

* * *

కలిమిఁ గాంతనుగోరఁగూడదని లోకంబందు శ్రీరంగనీ
తులుచెప్పంగఁబ్రవీణులైన ఘనులుండుర్గాని, హరింద్రియం
బులకుఁ దాసులుగారె? యక్కటకటా! పూర్వంబునంగొన్నివే
ళల మానీందరిలె కొందఱాశలను వీడంజాలిరే? రాఘవా॥ 85

అనుకూలంబగు వేళ చేకుఱమి యో, యర్థంబు లేకుంటయో
తనవారేమనుకొందురో యనెడి సంత్రాసంబో యే హేతువో
తనకున్నప్పుడె వండుగాని పరకాంతా శ్రీలకుం డేయఁగాఁ!
మనసుం గెల్చినవాఁడె పో యరుగు సంభావింపఁగన్! రాఘవా॥ 86

* * *

ఏనొక సంగతిన్ దలఁప, నీవు మఱొక్క టియాచరించిన
ట్లైన విచారముం విసుగునందుచు దూఱితిబుద్ధి లేక నిన్;
కాని, భవత్కృతంబయిన కార్యమె మేలయి చాలెసెక్కృపన్;
నేనె దురూహపాలగుట నిక్కము, నామతిదిద్దు రాఘవా॥ 87

తలఁచువిపత్తులబ్బినను దైవముఁదిట్టునె బుద్ధిమంతుఁడౌ
నరుఁడెవఁడేనియున్? ఘనఘనాఘనగర్జన మర్భకాళికిన్
వెఱపుఘటించుఁగాని యది వృష్టినిగోరు కృషీవలాళికిం
గరముప్రమోదదాయకముగాదె జగజ్జనపాల! రాఘవా॥ 88

* * *

ఎవఁడో యొకండు నింద యొనరించెనటన్న విధం బెఱింగి నీ
వవనిజగర్భిణిన్ విడిచి యప్పుడ కాననమందుడించిరా
ననరజుఁడైన లక్ష్మణున కానతి యిచ్చితివంట! ధర్మమా?
భువిసుతవంటిమానినికి భూరివిపత్తులు గల్గఁజేయు నీ
వెవరినిఁకన్ దయార్ద్రమతి నేలఁగఁబూనుదువయ్యా! రాఘవా॥ 89

తప్పుక్షమింపుమయ్య దయఁదప్పినవాఁడవటంటి నీ
వొప్పులకుప్పవౌటెఱిఁగియుండియు; రాజ్యములోనియొక్కఁడే
నొప్పనికార్యముల్ సలుపకుండు విభుండవుగాన వీడినా
వప్పుడు జానకీరమణిఁ; నంతియెగాని కృపారసంబు నీ
కెప్పుడులోటుగాదనుచు నెవ్వరెఱుంగనివారు? రాఘవా॥ 90

* * *

సీతనుగాని యన్యసతిఁజెందని ధర్మపరుండవౌటచే
ఆతతమైనప్రేమమున నామెనుబోలినపైడిబొమ్మనే
సీతగఁబ్రక్కనుంచుకొని చేసితి వాహయమేధయాగముల్;
నీతిని నీకు సాటియగు నేత యెవండు గలండు? రాఘవా॥ 91

"అమ్మా నీవిటనుండి బాధపడ నేలా? నిన్ను నా వీపుపై
నెమ్మినిక్ దాలిచి సత్వరంబ పతిసాన్నిధ్యంబునం జేర్తు రా
వమ్మా" యంచతిభక్తిఁ బావని తనుఁ బ్రార్థింపఁగా, "నాదుదే
హమ్ముం దాఁకఁగఁ బ్రాణనాథుఁ డొకఁడే యర్హుం" డటంచన్న సీ
తమ్మం బోలఁగలట్టి కాంతకలదే ధాత్రీస్థలిన్? రాఘవా॥ 92

*　　*　　*

అనయము యోగిమానసములందుఁ జరించెడి నీపదాబ్జముల్
ననునిఁక ధన్యుఁ జేయుటకు నా కఠినంపుమనస్సునందుఁ గూ
డ నిలుపఁగా దయామతిఁ గడంగితివౌర! భవత్పరోపకా
రనిరతి సన్నుతింపఁగఁ దరంబా కా యెవ్వరికైన? రాఘవా॥ 93

నీ నమ్రత్వము, నీ దయామయతయున్, నీ శాంతిసంపత్తియున్
నీ నిశ్ఛిద్రపరోపకారమతియున్, నీ శౌర్యధైర్యంబులున్
నీ నిశ్చంచలధర్మబద్ధతయు, వర్ణింపంగ దక్షుండనే?
యానందంబును బట్టలేకెటులా పద్యాల్లుచున్ రాఘవా॥ 94

* * *

ఎన్నోరీతుల వేడుచుంటిఁగద నన్నే నేళ రక్షింతువో
మున్నాగ్రాహమునోటఁజిక్కినగజంబున్ గాచినావంట యా
పన్నత్రాణ! భవత్కృపారససుధావారాశికిన్ లోటురా
దన్నా యిప్పుడు బిందువొక్కటి వ్యయంబైనంతనే రాఘవా॥ 95

చేయఁగనేర జన్నములు; చేయఁగనేరఁదపంబు నెన్నఁడుఁ
జేయఁగనేర దానములు; చేయఁగనేరను తీర్థయాత్రలఁ
జేయఁగనేర శాస్త్రములు చెప్పినచొప్పునఁ గర్మమెద్దియుఁ
మాయలు లేక తెల్పితిని మాయలు పన్నక ప్రోవు, రాఘవా॥ 96

* * *

వనితార్థంబులఁదిట్టిపోయుదురు సర్వానర్థమూలంబులం
చును; నిక్కంబరయంగ జిత్తమె నరుఁ జోద్యంబుగాఁ ద్రిప్పుచుఁ
ఘనకష్టాన్వితుఁజేయుచుండునని పల్కంగాఁదగుఁ; ధీరునె
వ్వనిఁగాంతా కనకప్రభావము కలంపంజాలెడుఁ? రాఘవా॥ 97

తనుమోహించినరంభకున్ శుకుఁడు మున్ దాఁజిక్కెనే? వరూ
థిని బల్మిందనుఁగౌఁగిలించినను దా ధీరత్వమున్బాసెనే
ఘనుఁడా నాప్రవరాఖ్య విప్రుఁడు? మహాకామార్తయై తన్ను వే
డిన చిత్రాంగిని రాసుతుండెనసినాఁడే తొల్లి? రాఘవా॥ 98

* * *

మున్నుత్రిశంకభూవరుని పుత్రుఁడు వైభవమెల్లఁబాసి యె
న్నెన్నియొ దుస్సహాపదలనేనియుఁగాంచెనుగాని, కల్మికై
యెన్నఁడుఁబొంకలేఁడు; జనకేప్సితసిద్ధికి సర్వరాజ్యమున్
గ్రన్నన వీడి శాశ్వతముగా అవివాహితుఁడై మహాధృతిన్
వన్నెకునెక్కె భీష్ముఁడును; వారివె జన్మములన్న రాఘవా॥ 99

మానుషజన్మ దుర్లభము మాధవసేవను మానఁబోకుఁడో
మానవులారయంచు మతిమంతులు పల్కుచునైననేమి! య
జ్ఞానులకెట్లు కల్గు సువిచారము నీకృపలేకపోయినన్?
నేనవివేకిగానఁ గరుణించి ననున్ సవరింపు రాఘవా॥ 100

* * *

అన్నము రామచంద్రయని ఆరటమొందెడు దీనమానవున్
గన్నపుడేవగించుకొని గంజియుఁబోయక తిట్టిపంపి, సం
ఘన్నుఁడువచ్చెనేని తమవంశము జన్మము నిల్లు ధన్యతన్
గన్నటులెంతయో ముదముగాంచుచు వానికనేకరీతులన్
మన్ననసేయువారిఁగన, మంకును నాయెడలెల్ల! రాఘవా॥ 101

పదపదరాయటంచు ధనవంతుల సేవకులీడ్చుచుండఁగా
సదయతఁజూడరేయనుచుఁ జాగిలిమ్రొక్కుచుఁబొట్టకోసమే
గద యవమానమెంతయునఁగాంచి భరింతురి దరిద్రులక్కటా!
ఉదరమునిచ్చి యన్నమిడకుండుట న్యాయమెనీకు? రాఘవా॥ 102

* * *

అన్నముపెట్టవయ్య యని ఆఁకొని వేఁడిన మాలవాని రా
వన్నయటంచు సోదరునియట్లు ముదంబున వానికష్టముఁ
గ్రన్ననఁదీర్చి నీపదముగాంచెను మున్నొకభూపుఁడద్దిరా!
యెన్నఁగరాని జ్ఞానమది! యెప్పుడు కల్గునొనాకు? రాఘవా॥ 103

కొంపలు కాలుచున్నపుడు గొబ్బున నచ్చటికేగి, మంటలన్
దొంపుననార్పఁగాఁగడఁగి దీనులయార్తిని దీర్పఁబోవుచే
యింపగుసేవ దేవునకు; నెంతయొ దవ్వుననుండి కర్మయో
గంపుఁబ్రశస్తిఁగూర్చిపలుకన్ హరిసేవనమౌనె? రాఘవా॥ 104

* * *

మనసా కోఁతివంటిదని మాన్యులు శాస్త్రములందుఁ జెప్పినా
రనుభవజన్యమైన పలుకయ్యది; యోలన, దైవమందు నా
కనిమిషమైన నిల్వక విఘాతములన్ గలిగించు భక్తుఁడై
మనజతనంబులన్ సలుపు మానవుచిత్తము! బత్తితోటనా
మనసునుగట్టిగట్టిగను మంచిదిగానొనరింపు రాఘవా॥ 105

ఎందఱుచక్రవర్తులో మహీంబరిపాలనసేయలేదె, యిం
కెందఱో చేయుచుండఁగనమే! మఱి చేసెడివారు గల్గరే!
యెందును రామరాజ్యమునకీడు త్రికాలములందునుండదం
చెందఱో విజ్ఞులందు రిగద యెంతమహాత్ముఁడవోయి! రాఘవా॥ 106

* * *

అనుపమమాధురీభరితమై, పరమాద్భుతశక్తియుక్తమై
మునిజనకీర్తనీయమయి, భూరిసుఖప్రదమంత్రరాజమై
తనరెడు నీదునామము సదాస్మరియించుచు నీకునిష్టమౌ
పనులనె నిర్వహించుచును వర్తిలఁజేయవె నన్ను రాఘవా॥ 107

జనమంచ్యన్వయమందుఁబుట్టితిని లక్ష్మ్యంబాసుగర్భంబునన్;
ఘనుఁడౌ వెంకటరామయార్యుఁడు సుధీగణ్యుండు మాతండ్రిః స
జ్జనసందోహవిధేయతాన్వితుఁడ, వైశారద్యశూన్యుండ; ని
ర్ధనుఁడన్, జ్ఞానవిహీనమానసుఁడ, సీతారామయాఖ్యుండ, నే
వినతుల్ సేయుచు నీకు నీకృతి సమర్పింతున్ బ్రభూ రాఘవా॥ 108

శ్రీరాఘవశతకము సర్వము సంపూర్ణము.